Qaumi Yekjahati Aur Islam
(Telugu)

# జాతీయ సమైక్యత

మూలం

డా. ముహమ్మద్ అబ్దుల్ హఖ్ అన్సారి

అనువాదం

అబ్దుర్రహ్మాన్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# జాతీయ సమైక్యత

మహాశయులారా!

నేను ఈ ప్రసంగ పత్రంలో విభిన్న మతాల మధ్య ఉన్న సమిష్టి విషయాలను చర్చిస్తాను. మతాల మధ్య అంగీకార భావం ఉంటే ఏ అంశాల్లో ఉందన్నదీ, విభేదాలు ఉంటే ఏ విషయాల్లో ఉందన్నదీ పరిశీలిద్దాము. దానితో పాటు ఈ సెమినార్ చర్చనీయాంశమయిన "సర్వమత సమానత"కు సంబంధించిన కొన్ని దృక్పథాల్ని కూడ సమీక్షించడం జరుగుతుంది.

ఆ తరువాత చర్చనీయాంశం, వాస్తవానికి మతాల మధ్య ఉన్న సమిష్టి విషయాలు ఆ మతాల అనుయాయులను ఎంతవరకు దగ్గర చేర్చగలవు, మనకు ప్రియాతి ప్రియమైన జాతీయ సమైక్యత, శాంతియుత సహజీవనం లక్ష్యసిద్ధికి ఎంతవరకు సహకరించగలవన్న విషయాలు. చివరగా సమిష్టి విషయాలను గురించి ఇస్లాం దృక్పథం ఏమిటి? ఆ అమూల్య ఆశయాల సిద్ధికి ఇస్లాం చేయగలిగిందేమిటో ప్రస్తావిస్తాను.

## మతాల మధ్య ఏకాభిప్రాయం గల అంశాలు

ఒకవేళ మనం విశాల హృదయంతో మతాలను అధ్యయనం చేసి మన స్వంత ఆలోచనలను ప్రక్కకు పెట్టి వాటి మధ్య సమిష్టి అంశాలేవో పరిశీలిస్తే మన మతాలన్నీ మానవ జీవితపు మౌలిక విలువల మీద ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయని స్పష్టంగ గోచరిస్తుంది. ఉదాహరణకు సర్వమతాలు సత్యం, న్యాయం, వాగ్దానపాలన, అప్పగింత భద్రతలను సత్కార్యాలుగా భావిస్తాయి. అసత్యం, అన్యాయం, హింస, వాగ్దానభంగం, నమ్మక ద్రోహాన్ని దుష్కార్యాలని తలుస్తాయి.

సానుభూతి, కారుణ్యం, ఉదారత, విశాల హృదయాన్ని అన్ని మతాలు గౌరవిస్తాయి. స్వార్థం, కాఠిన్యం, లోభం, సంకుచిత హృదయాన్ని ఏహ్యంగా చూస్తాయి. సహనం, ఓర్పు, నిగ్రహం, మృదుత్వం, సభ్యతను అన్ని మతాలు సుగుణాలుగా మన్నిస్తాయి. అసహనం, అల్పబుద్ధి, వాంఛాలోలత్వం, చపలత్వం, దురుసుతనం, అసభ్యతను చెడులుగానే భావిస్తాయి. బాధ్యతాభావం, కార్యనిరతి, పరిశ్రమ, విధి నిర్వహణలు అన్ని మతాలకు ప్రియమైనవి. నమ్మక ద్రోహం, సోమరితనం, అశ్రద్ధ, నిర్లక్ష్యం, బాధ్యతారాహిత్యం అన్ని మతాలకు అప్రియమైనవి. వాటి ఆగ్రహానికి కారణమైనవి.

అలాగే అన్ని మతాలు సామాజిక జీవిత నిర్మాణానికి క్రమశిక్షణ, నియమ నిబద్ధత, సహాయం, పరస్పర సహకారం, ప్రేమ, శ్రేయోభిలాష, సామాజిక న్యాయం అవశ్యమని నిర్ణయిస్తాయి. చీలిక, వేర్పాటు ధోరణి, విచ్ఛిన్నత, క్రమశిక్షణారాహిత్యం, అపకార భావం, హింస, దౌర్జన్యం, అన్యాయం, కల్లోలం, సంక్షోభాలను విషతుల్యమని అభివర్ణిస్తాయి. దొంగతనం, వ్యభిచారం, హత్య, దోపిడి, మోసం, లంచం, అపహరణ అన్ని మతాలలోనూ ఘోర నేరాలు. దుర్భాష, పీడన, పరోక్ష నింద, పరనింద, అసూయ, అపవాదు, కలతలు రేపడం అన్నింటిలోనూ మహా పాపాలు. తల్లిదండ్రుల పట్ల సత్ప్రవర్తన, బంధువులకు సహకరించడం, పొరుగువారికి ఉపకారం చేయడం, స్నేహధర్మపాలన, బలహీనుల సమర్థన, అనాథలు, నిస్సహాయుల పట్ల ఆదరణ, రోగుల పరామర్శ, బాధితులకు సహాయపడటం పుణ్యకార్యాలుగా భావిస్తాయి.

ఎలాంటి వినాయింపు లేకుండా అన్ని మతాలూ రుజువర్తనులను, నిష్కళంకులను, మృదు స్వభావులను, శ్రేయోభిలాషులను, అంతర్ బాహ్యాలలో సమానులను, తమ హక్కుల పట్ల సంతుష్టులై, ఇతరుల హక్కుల విషయంలో విశాల హృదయులైన వారిని సృజించాలన్న లక్ష్యమే పెట్టుకున్నాయి. తాము శాంతితో జీవిస్తూ ఇతరులను ప్రశాంతంగ జీవించనిచ్చేవారు, వారి ద్వారా ప్రతి ఒక్కరికీ మేలే కలుగుతుందన్న ఆశ కలిగించగలవారు, వారివల్ల ఏ ఒక్కరికీ చెడు సంభవించే ప్రమాదం లేనివారు రూపొందాలనే అన్ని మతాల ఆశయం.

మానవ జీవితానికీ, సమాజానికీ సంబంధించిన ఈ సాధారణమైన విలువలు ఏ ఒక్క మతానికీ ప్రత్యేకం కావు. అవి సర్వమతాల ఉమ్మడి సొత్తు. ప్రతి మతం ఆ విషయంలో విశ్వజనీనమైన దృక్పథం కలిగి ఉంటుంది. ప్రతి మతం ఈ విలువల పాటింపులో స్వపర భేదాన్ని సహించదు. న్యాయం, శ్రేయోభిలాష, సానుభూతి, ప్రేమలను తమ మతం వారి పట్లే చూపించాలని, పరమతస్థులపట్ల, హింస, కాఠిన్యం, శత్రుత్వంతో మెలగాలని బోధించే మతం లేదు. తమ వర్గంవారి ధనప్రాణాలు, మాన మర్యాదలు పరిరక్షించాలని, ఇతర వర్గాలవారి సొత్తు దోచుకోవాలని, వారి ఆస్తులను అపహరించాలని, వారి గృహాలు దహనం చేయాలని, వారి యువకుల్ని, పిల్లల్ని హత్య చేయాలని, వారి స్త్రీల శీలాన్ని భంగపరచాలని ఏ ఒక్క మతమూ బోధించదు.

ఏ మతమైనా స్వపర విభేదం చూపించినా అది కేవలం తమ స్వమతస్థుల పట్ల ఇతరుల కంటే కొంచెం ఎక్కువ మంచితనంతో మెలగాలని, అధిక ప్రేమతో వ్యవహరించాలని, మరింత త్యాగబుద్ధి ప్రదర్శించాలని మాత్రమే. అంతేకాని తమ వారి శ్రేయస్సు కోసం ఇతరుల హక్కుల్ని కొల్లగొట్టాలని, తమ వారి సంతోషం కోసం ఇతరుల ఆస్తిపాస్తులను దోచుకోవాలని, తమవారి ప్రగతీ వికాసాల కోసం ఇతరులను బలహీనపరచాలని, వారిని కించపరచాలని ఏ మతమూ కోరుకోదు, సహించదు కూడా.

ప్రతి మతమూ, సాధారణ మానవ విలువల్లోని సత్కార్యాలు మానవుని ఘనతను, సౌజన్యానికి ప్రామాణికమైనవని, చెడులు మానవుని నైచ్యానికి, పతనానికి చెరగని ముద్రలని నమ్ముతుంది. మానవుడు ఆ సత్కార్యాలను ఆచరించి మహోన్నతు డవుతాడు. ఆ చెడు పనులు చేసి దిగజారిపోతాడు, అవమానం పాలవుతాడు.

ప్రతి మతం, ఆ సత్కార్యాలను ఆచరించకుండ, ఆ చెడు పనులకు దూర మవకుండా ఏ మానవుడూ ముక్తిని పొందలేడని విశ్వసిస్తోంది. ముక్తిని పొందడానికి కావలసిన షరతులు, నియమాలు, ఆవశ్యకత లేవన్న విషయంలో మతాల మధ్య

భేదాభిప్రాయముంది. అయినా పైన ప్రస్తావించిన చెడులకు దూరంగా మెలగడం, మంచిని ఆచరించడం ప్రతి మానవుని విముక్తికి అవసరం అన్న విషయంలో అన్ని మతాలూ ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయి.

ప్రతి మతం బోధనల ప్రకారం, ఈ సత్కార్యాలు చిత్తశుద్ధితో, సంకల్పశుద్ధితో ఆచరించాలి. ఆ చెడుల పట్ల మనస్ఫూర్తిగా, పశ్చాత్తాపం చెందాలి, వాటిని విడనాడాలి. మనం చేసే సత్కార్యాల పట్ల ప్రదర్శనా బుద్ధి, లాభనష్టాల ఆశ, ఆశంకలు ప్రేరకాలు కారాదు. మనం మంచిని చేస్తే అది కేవలం మంచి కోసమే లేక దేవుని సంతోషం కోసమే చేయాలి. చెడును విసర్జిస్తే ఏదో వత్తిడి వల్లనో లేక ఏదో శక్తికి లొంగికాదు, కేవలం చెడును చెడుగా భావించి లేక దేవుని అయిష్టాన్ని గుర్తించి దాని నుండి తప్పించుకోవాలి.

వ్యక్తుల ఆత్మ ప్రక్షాళన, సమాజ నిర్మాణ విషయంలో మతాల దృక్పథాలు భిన్నంగా ఉన్నాయి. కాని ఆత్మ ప్రక్షాళనకు ఉద్దేశించిన ఏ కార్యక్రమమయినా, సమాజ నిర్మాణం కోసం చేపట్టే ఏ ప్రణాళిక అయినా పైన పేర్కొన్న సాధారణ మానవ విలువలను సాధించకుండ విజయవంతం కాజాలదు అనే విషయంలో మటుకు ఏ మతమూ విభేదించదు.

చింతన, సంస్మరణ, ఆరాధన, పూజల ద్వారా సాధించవలసిందేమిటీ? ఈ విషయంలోనూ మతాల మధ్య భేదాభిప్రాయముంది. కాని ఒక విషయంలో మటుకు అన్నీ ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయి; ఈ ఆచరణలకు ఏ ఆశయాలు ఉన్నప్పటికీ వాటన్నింటి మహదాశయం ఒక్కటే, అది, మానవుని మనో మస్తిష్కాలు,శక్తీ సంకల్పాల సుశిక్షణ. ఈ శిక్షణ ద్వారా సాధారణ మానవీయ సత్కార్యాలు మనిషికి ప్రీతి పాత్రమయి పోవాలి. ఆ సత్కార్యాలు అసంకల్పితంగానే మనిషిచేత అమలులోకిరావాలి. అలాగే సాధారణ మానవీయ దౌష్ట్యాలకు తీవ్రమైన విద్వేషం మనిషిలో జనించాలి. మనిషి వాటికి తానంతట తానే దూరంగా

మసలుకోగలగాలి. మంచి పని చేసి మనిషి ఆనందాన్ని పొందాలి. పొరపాటున చెడు పని ఏదయినా జరిగినా దానికి సిగ్గుపడాలి, బాధపడాలి.

పూజ, ధ్యానం, తపస్సు, సాధనలకు ప్రతిగా మానవుల పట్ల సానుభూతి, ప్రేమ, ఉపకారం, త్యాగం ఇత్యాదివాటికి గల స్థానం ఏమిటీ అన్న విషయంలోనూ భిన్నమతాల మధ్య భేదాభిప్రాయముంది. అయినప్పటికీ ఉత్తమ నైతికతలోని కొరతను మరే విషయం ద్వారానూ పూరించలేమన్న విషయంలో ఎవరికీ భేదాభిప్రాయం లేదు.

పూజా పురస్కారాలు, నమాజ్, ఉపవాసవ్రతాల ఆధిక్యత, పుణ్యక్షేత్రాల సందర్శన, గంగా స్నానాలు, హజ్ యాత్రలు అన్నీ కలిసి రుజువర్తన, సత్కార్యాల్లోని లోపాల్ని పూరించజాలవని, వాటికి భిన్నమయిన చెడుల వల్ల ఏర్పడిన మచ్చను కడగజాలవని అందరూ ఒప్పుకుంటారు.

## మతాల మధ్య విభేదాలు

పైన ప్రస్తావించిన సాధారణ మానవీయ నైతిక విలువలే మతాల మధ్య సమిష్టి అంశాలు, సమాన విషయాలు. ఇవి తప్ప మిగతా విషయాలు బాహ్యా పరమైనవి (Formal), నకారాత్మకమైనవే అధికం, భావపరమైనవి, సకారాత్మక మైనవి తక్కువ. ఈ విషయాన్ని నేను కాస్త వివరంగ చెబుతాను.

ప్రతి మతంలో సమిష్టి భావనలు కొన్ని ఉన్నాయి. అవి: ఈ విశ్వవ్యవస్థ, మానవుని ఉనికి కేవలం భౌతిక శాస్త్ర పరిధిలోని విషయం కాదు. ఈ శాస్త్రాల పట్టుకు అందని వాస్తవాలు కూడ ఇంకా ఎన్నో ఉన్నాయి. తన అస్తిత్వంతో మిరుమిట్లు గొలుపుతూ కాన వస్తున్న ఈ మహోన్నత విశ్వవ్యవస్థ స్వయం సమృద్ధం కాదు. దీనికి ఆవల కూడా ఒక వాస్తవం ఉంది. ఈ నకారాత్మక భావన ప్రతి మతంలోనూ ఉంది. అయితే "కానరాని ఆ వాస్తవం" ఏమిటి? ఒకటా లేక అనేకమా? దాని లక్షణాలేమిటీ? విశ్వంతోనూ మానవునితోనూ దానికి

గల సంబంధం ఏమిటీ? అన్న ప్రశ్నలు ఎదురయినప్పుడు ఆ మౌలిక సమస్యలలో సమాధానం ప్రతి మతం వేర్వేరు మార్గాన్ని అనుసరిస్తుంది.

ఇస్లాం దృష్టిలో ఆ వాస్తవం ఒక అస్తిత్వం. అ చైతన్యం, జ్ఞానం, శక్తి, అధికారం, సంకల్పశక్తి ఉన్న అస్తిత్వం. అది ఒక్కటే, ఒక్కటిగానే ఉంటుంది. అదే విశ్వాన్ని సృజించింది. అదే దాన్ని నడిపిస్తోంది, నిర్వహిస్తోంది, పరిపాలిస్తోంది. మానవుడు ఆత్మ, శరీరం గల ఒక మహాద్భుత మిశ్రమం. తన సృష్టికర్తలా మనిషి కూడ జ్ఞానం, శక్తి, అధికారం, సంకల్పశక్తి కలవాడు. కానీ ఇంతగా సామ్యం ఉన్నప్పటికీ మనిషి కేవలం ఒక సృష్టిరాశి, దాసుడు మాత్రమే. దైవత్వంలో భాగస్వామి కాడు. తన ఉనికికి, అధికారానికి దేవుని మీద ఆధారపడి ఉన్నవాడు, ఆయన ఆజ్ఞకు బద్ధుడై ఉన్నవాడు. తన స్రష్ట, పరిపోషకుని పట్ల విధేయత, ప్రేమానురాగాలు కలిగి ఉండడమే అతనికి ప్రాప్తమయ్యే అత్యున్నత గౌరవోన్నతి.

దేవుని ఏకత్వభావన యూదు మతంలో కూడ ఉంది. ఈ భావనే ప్రారంభంలో క్రైస్తవంలో కూడ ఉండేది. ఆ ప్రారంభ కాలంలో హజ్రత్ ఈసా (క్రీస్తు) స్థితి, దేవుని విధేయుడైన దాసుడు, ప్రవక్త లాంటిది. కాని కాలచక్రం తిరిగిన కొద్ది ఆ పరిశుద్ధమైన ఏకత్వభావనా స్థానాన్ని "త్రిత్వ" దైవ విశ్వాసం ఆక్రమించుకుంది.

జొరాష్ట్రుల్లో కూడ ఏకేశ్వర విశ్వాసం ఉండేది. కాని మెల్లమెల్లగా కాలానుగుణంగా ఆ మతంలో మార్పులు ప్రారంభమయ్యాయి. నేడు దాని అనుయాయులు మంచి, చెడు; వెలుగు, చీకటి అనే రెండు సమాంతర శాశ్వత వాస్తవాలను నమ్ముతున్నారు. ఆ రెండు సమరశీల శక్తుల సంఘర్షణ ఫలితమే విశ్వం, మానవ చరిత్రయని అభిప్రాయపడుతున్నారు.

జైన మతం ఆత్మను శాశ్వత, ఆదీ, అంత రహితమైన వాస్తవమని నమ్ముతుంది. అది అనూహ్యమైన రీతిలో ఆత్మశూన్య పదార్థంతో విలీనమై అంతం కాని జీవిత చక్రంలో బందీ అయిపోతుంది. ఈ విశ్వం, దానిలోని ప్రతి పదార్థం

ఎంత జడమైనది అయినా, ఎంతగా చైతన్య శూన్యమైనది అయినా అది ఆత్మకు చెందిన విభిన్న ఉత్థాన పతన స్థితులకు ప్రతిరూపం మాత్రమే. ఈ ఆత్మ సంబంధమైన వాస్తవికత ఒక్కటి కాదు, అసంఖ్యాకంగ ఆత్మలు ఉన్నాయి. ఆ అసంఖ్యాక ఆత్మల కన్నా ఉన్నతమైనది మరే అస్తిత్వమూ దేవుడనబడేది లేదు. సాధారణంగ ఏ గుణగణాల్ని, ఏ లక్షణాల్ని, ఏ అధికారాల్ని దేవునివని చెప్పడం జరుగుతుందో వాటిని జైనమతం, ఆత్మశూన్య పదార్థాల నుండి శాశ్వత విముక్తి పొందిన ఆత్మలకు వర్తింపజేస్తుంది.

బౌద్ధ మతంలో అనేక శాఖలు ఉన్నాయి. 'వాస్తవం' గురించి వాటి విశ్వాసాలు పరస్పరం విరుద్ధమయినవి. దాని ప్రధాన శాఖ ప్రకారం ఏ వాస్తవమూ అవినాశం కాదు. మానవ చేతన అనేది, క్షణికమైన చేతనావస్థలు ఒకదానివెంట మరొకటి తెచ్చే అంతం కాని ఆపత్తుల పరంపర. వాస్తవమంటూ ఏదైనా ఉంటే అది ఈ పరంపర తప్ప మరేమీ కాదు. ఆ పరంపర తెగిపోవడమే మానవ ప్రయత్నాల పరమార్థం. దాన్నే నిర్యాణము అని అంటారు. కొన్ని వర్గాల అభిప్రాయంలో నిర్యాణము కేవలం నకారాత్మకమయిన విషయం కాదు. అదొక బుద్ధికందని, అనిర్వచనీయమైన సకారాత్మక వాస్తవికత.

హిందూత్వానికి ఒక నిర్దిష్టమైన సిద్ధాంతం లేదు. దానిలో ఏకేశ్వర వాదము, ద్వైవత్వము, బహుదైవ భావనలు సమ్మిళితమై ఉంటాయి. చివరికి నాస్తికత్వం, దైవతిరస్కారం లాంటి సిద్ధాంతాలూ హిందూత్వంలో ఉన్నాయి. కాని హిందూ మతంలో మొత్తానికి ఒక సర్వోన్నతుడైన దేవుని భావన అన్నింటిపైనా బలమయినది. అయితే దైవత్వం ఆయనకు ప్రత్యేకించబడలేదు. భూమ్యాకాశాల్లోని అసంఖ్యాక సజీవ, నిర్జీవాలు దైవత్వంలో చేర్చబడటం జరిగింది. ఈ ప్రక్రియకు హిందూ మతంలో ఎంతో విస్తృతి లభించింది. చివరికి దేవుడు, ఇతర చరాచర సహవర్తులకు మధ్య మౌలిక భేదమే మిగుల లేదు - ఇస్లాం, యూదుమతంలో గల సృష్టికర్త-సృష్టిరాశులు, దేవుడు-దాసులకు గల శాశ్వతమైన, అనంతమైన భేదాన్ని హిందూ మతం తిరస్కరించింది. కొన్ని వర్గాల అభిప్రాయంలో వాస్తవికత ఒక 'అవ్యక్తమైన

అస్తిత్వం.' విశ్వంలోని అణువణువు, మానవాళిలోని ప్రతి వ్యక్తీ ఆ అవ్యక్తమైన అస్తిత్వానికి బాహ్యరూపం. సామాన్య హిందువు, భగవంతుడు అని కొలిచే అస్తిత్వం కూడ ఆ వర్గాల అభిప్రాయంలో, ఆ పరమ వాస్తవికతకు ఒక నిర్దిష్ట రూపం మాత్రమే. మానవ ప్రగతికి పరమార్థం, ఆ ఏకైక నిర్దిష్ట వాస్తవికత జ్ఞానాన్ని పొందడం, దాన్ని సాధించడం.

మతాల మధ్య, వాస్తవికత, విశ్వం, మానవుడు – ఈ మూటికి సంబంధించిన అభిప్రాయాల్లో వైరుధ్యాలు మౌలికమైనవి, వాస్తవమైనవి. ఈ వైరుధ్యాల ప్రభావం ఆయా మతాల వ్యవస్థ మీద, అంశాల మీద విభిన్న రీతుల్లో కూడా పడుతుంది. నుతాల పోలిక విభిన్న వృక్షాల్లాంటిది. ప్రతి వృక్షంలో వేరు, కాండం, కొమ్మలు, ఆకులు, పుష్పాలు, ఫలాలు ఉంటాయి. ఈ బాహ్యాపరమైన పోలికలో అన్నీ సమానమైనప్పటికీ ప్రతి వృక్షం మరో వృక్షంతో వేరయినది. ఇలాగే బాహ్యసామ్యం ఉన్నప్పటికీ ప్రతి మతంలో సత్యం పట్లగల భావన, సత్యంతో సంబంధం పెంచుకునే పద్ధతులు మానవ జీవిత పరమార్థం, దాన్ని సాధించే విధానాల రీత్యా మతాలు పరస్పరం భిన్నమైనవి.

ఉదాహరణకు ఆరాధన, పూజకు సంబంధించిన పద్ధతుల్ని పరిశీలిద్దాము. వీటి ద్వారానే మతానుయాయులు తమ తమ మతాల ప్రకారం ఉన్నత వాస్తవికతతో సంబంధాలు పెంచుకుంటారు. సర్వోన్నతమైన వాస్తవికతగా అవ్యక్త అస్తిత్వాన్ని విశ్వసించే మతాలలో మానవునికీ, ఆ అస్తిత్వానికీ మధ్య ఉన్న సంబంధం, అనంతమైన వాస్తవికత, దాని నిర్దిష్ట అభివ్యక్తివంటిది. ఆ మతాలలో ధ్యానానికే మౌలిక ప్రాముఖ్యం. దీనికి భిన్నంగా ఒక నిర్వచనీయ శక్తిని దేవునిగా భావించే మతాలలో దైవానికీ, మానవునికీ ఉన్న సంబంధం స్వామికి దాసునికీ గల సంబంధం లాంటిది. వాటిలో పూజ, సంస్మరణ, ప్రార్థన ప్రధాన ఆరాధనలు.

అలాగే ఆత్మ, భౌతిక శరీరంలో బంది అని భావించే మతాలలో, ఆత్మ, శరీరాల మధ్య విరోధం, ఘర్షణను మౌలిక వాస్తవంగా నిర్ణయించడం జరిగింది.

వాటిలో సర్వసంగపరిత్యాగం, మనోకాంక్షల నిగ్రహం, తపస్సులను చిత్తశుద్ధికి అవశ్యమైనవిగా భావించడం జరిగింది. దీనికి భిన్నంగా ఆత్మ, శరీరాల మధ్య సహకారానికి ప్రాధాన్యత ఇచ్చే మతాలు ఈ భూమండలం మీద దేవుని సార్వభౌమత్వ స్థాపనను మానవాత్మ పరమార్థం అని అభివర్ణిస్తాయి. అవి ప్రాపంచిక వస్తు సామగ్రితో ప్రయోజనం పొందడం, సంస్మరణ,ఆరాధనలు జరపడం, సామాజిక, సామూహిక కార్యక్రమాల్లో పాల్గొనడం ఇత్యాది విషయాల మధ్య సమతూకం పాటించాలని బోధిస్తాయి.

మతాల మధ్య ఈ విభేదాలు విశ్వాసాలు, ఆరాధనలు, ఆత్మశుద్ధికి సంబంధించిన పద్ధతుల వరకే పరిమితం కాదు. వాటి విలువల వ్యవస్థలో, జీవన వ్యవస్థలోను ఆ విభేదాలు కొనసాగుతాయి. ఉదాహరణకు ఒక మతంలో 'అహింస' మూల విశ్వాసంలోనిది. ఇంకో మతంలో అది కేవలం ఒక విలువ. ఒక మతంలో దిగంబరత్వం, సర్వసంగ పరిత్యాగం, బ్రహ్మచర్యం, నిగ్రహం ఆదర్శనీయమైనది. మరో మతంలో అది అసమ్మతమయినది, గర్హించదగ్గ చర్య. ఒక మతంలో తల్లి గర్భం నుండి జన్మించేటప్పుడే ఒక మానవుడు ఉత్తముడుగానో, నీచుడుగానో పుడుతాడు. జీవితాంతం అతడు ఆ స్థితిలోనే ఉంటాడు. మరో మతంలో ఆదం సంతానంలోని వారందరూ ఏ ఇంటపుట్టినా సమానంగా గౌరవనీయులు, ప్రియమైనవారు. ఒక మతంలో హెచ్చుతగ్గులు, తారతమ్యాలు వాస్తవమైనవి. సమానతలు కృత్రిమమైనవి, తాత్కాలికమైనవి. ఇంకొకరి వద్ద సమానతలు వాస్తవమైనవి. విభేదాలు, తారతమ్యాలు సమాజం సృష్టించిన కాల్పనిక దౌష్ట్యం.

## సర్వమత సమానతా సిద్ధాంతం

నేను సూచించిన ఈ విభేదాల్ని కొందరు వాస్తవమైనవి కావని భావిస్తారు. అది మా స్థూల దృష్టి, సంకుచిత దృష్టికి తార్కాణమని అంటారు. నేను వారి చిత్తశుద్ధిని ఆదరిస్తాను, ఒప్పుకుంటాను. కాని వారి అభిప్రాయాలతో ఏకీభవించను.

మతాల మధ్య వాస్తవంగా ఏ అంశాలలో అంగీకార భావముందో వాటిని నేను సవివరంగా మీ ముందుంచాను. ఆ అంశాలు తప్ప మరే విషయాల్లోను అంగీకారం గోచరించదు.

నేను పలుమార్లు ప్రస్తావించినట్లు, ఏ అంశాల్లో అంగీకార భావముందో అవి ప్రతి మతంలోని ప్రధానాంశాలని నేను భావిస్తాను. అలాగే ఏ అంశాల్లో వైరుధ్యాలు కానవస్తాయో అవి కూడ ముఖ్యమైనవి, మౌలికమైనవి అని నా అభిప్రాయం. మతాల మధ్య అంగీకార భావం కూడ వాస్తవమే. వైరుధ్యం కూడ వాస్తవమైనదే. వైరుధ్యం స్థూల దృష్టి ఫలితం కాదు, అంగీకార భావమూ, విచక్షణా రహితమైన సదభిప్రాయం పర్యవసానమూ కాదు. నా దృష్టిలో ప్రముఖమైనవి, అప్రముఖమైనవి, మౌలికమైనవి, స్థూలమైనవి అన్నవన్నీ సాపేక్షకమయినవి. ప్రతి మతాన్ని నమ్మేవారు దేన్ని ప్రధానమైనదని, మౌలికమైనదని నిర్ణయిస్తారో మేము దాన్ని ప్రధానమయినదని ఒప్పుకోవడానికి సిద్ధంగా ఉన్నాము. అలాగే వారు ఏ విషయాన్ని అప్రధానమని అంటే మేము దాన్ని అప్రధానమనే అంగీకరిస్తాము.

కీ.శే. డా. భగవాన్ దాస్ తన గ్రంథం "The Essential Unity of All Religions" (సర్వమతాల అవశ్యమైన సమైక్యత) లో ఈ దృక్పథాన్ని ప్రవేశ పెట్టారు: మతాలు కేవలం మౌలిక విలువల్లోనే సమభావం కలిగిలేవు, విశ్వాసం, ఆరాధన, నైతికత, సామాజిక సూత్రాల్లో కూడ వాటి మధ్య మౌలికంగా సమైక్యత ఉంది. వాటిలో ఉన్న వైరుధ్యాలు అప్రధానమైన విషయాలకు సంబంధించినవే. ఆయన అభిప్రాయంలో మానవతకు ఒక మౌలిక ధర్మం అంటూ ఉంది. అది అతి ప్రాచీనమైనది. శాశ్వతమైనది. (అది సర్వమతాలలోని ఉమ్మడి అంశం. మిగిలినవన్నీ తాత్కాలికమైనవి) ఆయన అభిప్రాయంలో సర్వమతాలు తమ అప్రధానమైన, తాత్కాలికమైన విభేదాల్ని విస్మరించి ఆ ఉమ్మడి, ప్రాచీన, శాశ్వతమైన మతాన్ని ఆమోదించి సమైక్యం, సమీకృతం కావాలి; ఆ సమైక్యత ఆధారంగానే జీవిత పునర్నిర్మాణం జరగాలి; అందులోనే మానవుని ముక్తి ఉంది.

ఆ ప్రాచీన, శాశ్వత మతాన్ని ఆయన విశదీకరించిన దాని ప్రకారం; అసలు ఈ విశ్వం ఒక మహోన్నతమైన మానవాతీత ఉనికికి వ్యక్తమయిన రూపం. ఈ చరాచర సృష్టి, సర్వమానవులు ఆ అనంతమైన మానవాతీత శక్తికి పరిమిత రూపాలు. మానవుని సర్వప్రయత్నాల చివరి లక్ష్యం, అతని వ్యక్తిత్వపు ఆంశికమైన ఉనికిని పరిపూర్ణమైన ఆ మానవాతీత శక్తిలో విలీనం కావడం కావాలి. దానితో సంయోగం చెంది, బిందువు సాగరంలో కలసి అనంతమై పోయినట్లు తానూ అనంతమయి పోవాలి. అందులోనే మానవుని సాఫల్యం, విముక్తి ఉన్నాయి.

తత్వశాస్త్రం రీత్యా ఈ అద్వైత విధానం ప్రాముఖ్యత ఏమిటి? అనేది వేరే విషయం. అలాగే కొందరు యోగులు, సూఫీలు ఈ సిద్ధాంతాన్ని, తమ ఆధ్యాత్మిక అనుభవాలకు ఏ మేరకు అనువయినదిగా భావిస్తారో? అన్న విషయం కూడా ప్రక్కకు పెడదాం. అయితే మత చరిత్రకు సంబంధించినంత వరకు మతాలలో ఏ మతం భూమిక కూడ ఈ అద్వైత సిద్ధాంతం మీద ఏర్పడలేదు. ఇక ఇస్లాంకు సంబంధించినంత వరకు ఇందులో దేవుని భావన ఒక అస్తిత్వం, ఒక ఉనికితో ముడివడి ఉంది; దైవం, మానవుల మధ్య సంబంధం, స్వామి, దాసుల వంటిది. ఇస్లాంలో మానవుని జీవిత పరమార్థం, మానవుడు తన ఆంశికమైన ఉనికిని నశింపచేసి దేవుని ఉనికిలో ఐక్యమైపోవడం కాదు, దేవుని ఆజ్ఞకు విధేయుడుగా జీవిస్తూ, చిత్తశుద్ధితో ఆయన ప్రసన్నతను బడయటం ద్వారా ఆయన సామీప్యం, సాన్నిధ్యంలో తన వ్యక్తిత్వాన్ని పరిపూర్ణం చేసుకోవడం. డా. భగవాన్ దాస్ ఇస్లాంను అధ్యయనం చేస్తున్న సమయాన ముస్లిం సూఫీల ఓ పరిమిత వర్గాన్ని దృష్టిలో ఉంచుకున్నారు. ఒకవేళ ఆయన సంపూర్ణమైన ఇస్లామీయ సూఫీ తత్వశాస్త్రాన్ని అయినా అధ్యయనం చేసి ఉంటే తన అద్వైత సిద్ధాంతాన్ని ముస్లిం సూఫీల సిద్ధాంతమని అభివర్ణించి ఉండేవారు కాదు. ఇంకా ఆయన దివ్యఖుర్‌ఆన్, మహాప్రవక్త పవిత్ర జీవిత చరిత్రను అధ్యయనం చేసి ఉంటే అసలు ఆ సిద్ధాంతాన్ని ఇస్లాంకు ఆపాదించే వారే కారు.

డా. భగవాన్ దాస్ ప్రతిపాదించే అద్వైత సిద్ధాంతం ఒక్క ఇస్లాంకే కాదు

యూదు మతం, క్రైస్తవ మతానికి కూడ వర్తించదు. కొందరు క్రైస్తవ సూఫీలు తమ ఆధ్యాత్మిక అనుభవాల అన్వయం సందర్భంలో అద్వైత పరిభాషను ప్రయోగించిన మాట వాస్తవమే. కానీ ఈ సిద్ధాంతం క్రైస్తవ మతంలో ఒక అంశంగా ఏనాడూ కానరాదు. దానికి ఏనాడూ ఆదరణ లభించలేదు. భారతీయ మతాలకు కూడ ఈ సిద్ధాంతం వర్తించదు. జైన, బౌద్ధ మతాల చింతన ఎంత మాత్రం అద్వైతం ఆధారంగా ఏర్పడలేదు. ఈ సిద్ధాంతం అధికంగ ఉపనిషత్తులలోని చింతన అని చెప్పవచ్చు. కాని ఉపనిషత్తుల అద్వైత సిద్ధాంతం హిందూ యోగులు, మునుల, ఆధ్యాత్మిక అనుభవాల అన్వయం మాత్రమే అని, అది హిందూ ధర్మానికి నిర్వచనం కాదని మాత్రం మరువరాదు. చారిత్రక హిందూ ధర్మంలోని ప్రత్యేక విశ్వాసాలు, పూజా పురస్కారాల ప్రత్యేక ఆచార వ్యవహారాలు, నైతిక విలువలు, సామాజిక వ్యవస్థ – వీటిలో ఏ ఒక్కదాని సంబంధం కూడా ఉపనిషత్తుల అద్వైత సిద్ధాంతంలో లేదు. ఈ సిద్ధాంతం ఆ ఆచారవ్యవహారాలను సృష్టించనూ లేదు, వాటి రూపురేఖల నిర్మాణంలో దాని పాత్ర కూడా లేదు.

సర్వమత సమానతా సిద్ధాంతం సూఫీయిజం, తత్వశాస్త్రాలలో నుంచి పుట్టింది. సూఫీ హృదయం మీద ఓ ప్రత్యేక సందర్భంలో కలిగే అనుభవానికి భావాన్వయమే ఈ సిద్ధాంతం. సూఫీ ఆ దశను దాటి తరువాతి దశలో ప్రవేశించినప్పుడు వాస్తవికత ఈ అద్వైత రూపంలో కాక మరో రూపంలో దర్శనమిస్తుంది. ఆ దశలో సృష్టికర్త, సృష్టికి గల భేదం స్పష్టమయి ముందుకు వస్తుంది. అప్పుడు ప్రవక్తలు చెప్పిన ధర్మ నిర్వచనం సరయినదిగా గోచరిస్తుంది. ఇస్లామీయ సూఫీల్లో చాలా మంది మహనీయుల అభిప్రాయంలో అద్వైత సిద్ధాంతం వాస్తవికతకు నిజమైన నిర్వచనం కాదు. పైగా అది అలా నిర్వచించే సూఫీల అపరిపక్వతకు నిదర్శనం. ఒక మధ్య దశను ఆధ్యాత్మిక పథాన చివరి గమ్యమని తలంచి ఇస్లామీయ సూఫీలు చేసిన పొరపాటు వంటిదే ఉపనిషత్తుల యోగులు కూడ చేశారు. అద్వైత భావాన్ని మతాల ఉమ్మడి అంశంగా అభివర్ణించే వారు యోగం, సూఫీయిజం, మతం మధ్య ఉన్న మౌలిక భేదాన్ని గ్రహించలేదు. ప్రతి మతం

వాస్తవికతను గురించి ఒక ప్రత్యేక సిద్ధాంతం, మంచి చెడుల ఒక ప్రత్యేక ప్రమాణం, జీవిత నిర్మాణానికి సంబంధించిన వేర్వేరు పథకం కలిగి ఉంది. అది, ఇతర సిద్ధాంతాలను, ప్రమాణాలను, పథకాలను తప్పుయినవిగా లేక కనీసం లోపభూయిష్ట మైనవిగా భావిస్తుంది. ఆ విషయమే దాని ప్రత్యేక ఉనికికి, దాని మనుగడకు కారణభూతమవుతుంది. యోగుల, సూఫీల సర్వమత సమానతా సిద్ధాంతాలు 'వాస్తవికత'కు సంబంధించిన ప్రత్యేక సిద్ధాంతాన్ని, నైతిక ప్రమాణాన్ని, జీవిత విధానాన్ని కలిగి ఉండవు. వీటిని సృజించే యోగ్యత కూడ వాటికి లేదు. ఓ స్వరంలో అవి ప్రతి సిద్ధాంతాన్ని సరైయినదిగా, ప్రతి ప్రమాణం ఉత్తమమైనదిగా, ప్రతి విధానం సత్యమైనదిగా నిర్ణయిస్తాయి. కాని రెండవ స్వరంలోనే ప్రతి దాన్నీ దోష భూయిష్టమైనదిగా, అపసవ్యమైనదిగా, అసత్యమైనదిగా ప్రకటిస్తాయి. నిజానికి వాటిలో మంచి చెడుల, సత్యాసత్యాల సమస్త భేదభావాలకు, తారతమ్యా లకు ఆస్కారముండదు. సర్వమత సమానతా సిద్ధాంతం, మతాల మధ్య ఉమ్మడి అంశాన్ని అన్వేషించదు. అది నిజానికి మతాల (Falsification) తప్పుయినవిగా నిర్ణయించే విధానం.

మతాల మధ్య భావ సమైక్యతకు చేసిన మరో ప్రయత్నానికి నిదర్శనం సూఫీ స్వభావం గల ఒక ఐరోపా విద్వాంసుడు యఫ్. షీవోన్ గ్రంథం, The Transcendensal Unity of Religion. షీవోన్ అభిప్రాయంలో వాస్తవికత రెండు రకాలు. అధిభౌతికత అనీ, మత పరమయినది అనీను. అధిభౌతిక వాస్తవికత ఒక్కటే. మత పరమయిన వాస్తవికతలు అనేకం. అయినా ఈ సర్వమత పరమైన వాస్తవికతలు ఆ ఒక్క ఆధిభౌతిక వాస్తవికతకు బిన్నరూపాలు మాత్రమే. షీవోన్ అధిభౌతిక వాస్తవికత, డా. భగవాన్ దాస్ అద్వైత వాస్తవికత భిన్నమైనవి కావు. అధిభౌతిక వాస్తవికత మతపరమైన వాస్తవికతలకు భిన్నమైన మరో అంశమని షీవోన్ అంగీకరిస్తాడు. కాని ఆయనకు ఆ భేదం ఎలాంటిదో దాని సరయిన పరి జ్ఞానం లేదు. ఆ భేదం సరయిన రీతిలో ఆయనకు అవగతమయి ఉంటే ఆయన, మతపరమైన వాస్తవికతల్ని ఆధిభౌతిక వాస్తవికతకు భిన్న రూపాలని చెప్పి

ఉండేవాడు కాదు. అధిభౌతిక వాస్తవికత అన్నా లేక అద్వైత వాస్తవికత అన్నా రెండింటికి మూలం సూఫీతత్వ అనుభవాలే. చారిత్రక మతంతో దానికి ఎలాంటి సంబంధం లేదు.

## మతం - జాతీయ సమైక్యత

మతాల మధ్య సైద్ధాంతిక సమైక్యతను అన్వేషించే ఇతర ప్రయత్నాల ప్రస్తావన నిరుపయోగమే. క్లుప్తమైన ప్రసంగ వ్యాసంలో దానికి అవకాశం కూడ లేదు. ఇంతకు అలాంటి ప్రయత్నం అవసరమైనదా? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఈ వ్యాసం ప్రారంభంలో విపులంగ ప్రస్తావించిన సాధారణ మానవతా విలువల పట్ల అంగీకారభావం, సమైక్యతలు విభిన్న మతాల వారిని దగ్గర చేర్చడానికి, ఒకే మానవతా బాంధవ్యంలో బంధించడానికి, శాంతియుత సహజీవనం గడప డానికి, ప్రేమానురాగాలతో మెలగడానికి, న్యాయం, కారుణ్యం, త్యాగబుద్ధితో ప్రవర్తించడానికి, పరస్పర మత సంప్రదాయాలను, మహనీయుల్ని, ధార్మిక చిహ్నాలను గౌరవించుకుంటూ కలసిమెలసి శాంతియుత సభ్యసమాజాన్ని నిర్మించ డానికి సరిపోవా? ఈ సమిష్టి మానవతా విలువలు ఒక మంచి మానవునిగా, ఒక బాధ్యతాయుత పౌరునిగా, శాంతి ప్రియమైన సమాజ నిర్మాణానికి భూమికలుగా భాసిల్లుతాయని మా నమ్మకం. కాని ఒక షరతు–అతి ముఖ్యమైన షరతు– ప్రతి మతం వారు ఈ విలువల్ని మనఃపూర్వకంగా పాటించాలి. మతానుయాయులు తమ మతం ఉపదేశించే నిజ బోధనలైన ఈ విలువల్ని, వారి మతం ఇవ్వగోరిన స్థానాన్ని తమ జీవితంలో ఇచ్చినట్లయితే మన సమాజంలో నలుదిశలా శాంతి కాంతులు ప్రసరిస్తాయి.

భారతదేశంలో జాతీయ సమైక్యత, సంఘీభావం ఒక సమస్యగా తయారయింది. జాతులు, భాషలు, మతాల ఆధిక్యత కూడ సమైక్యతా మార్గంలో ప్రతిబంధకమని చాలా మంది భావిస్తూ ఉంటారు. కొందరు ఈ జటిల సమస్యకు పరిష్కారంగా సర్వ మత సమానతను ప్రతిపాదిస్తారు. కాని ఈ సర్వమత సమానతా సిద్ధాంతం ఏ ఒక్క మతానికీ ప్రత్యామ్నాయం కాజాలదని వారికి తెలియదు.

అధిక భాషలకు పరిష్కారం వాటి మధ్య ఒక "సమిష్టి భాష"ను అన్వేషించడం కానట్లే, లేక విభిన్న భాషల్లోంచి కొన్ని అంశాల్ని ఎంపిక చేసి ఒక మిశ్రమ భాషను తయారు చేయడం కానట్లే, మతాల ఆధిక్యతకు పరిష్కారం, వాటిలోంచి ఒక సమిష్టి మతాన్ని సృష్టించడమో లేక వాటిలోని ఒక్కో అంశాన్ని కలిపి ఒక నూతన "దైవ ధర్మం" (దీనె ఇలాహి)ని నిర్మించడమో కాజాలదు.

కొన్ని 'అభ్యుదయ' వర్గాలు మతాల ఆధిక్యతనే కాదు అసలు మతాన్నే విభేదాలకు, వైషమ్యాలకు కారణమని భావిస్తాయి. వారి దృష్టిలో దైవం లేక అల్లాహ్ నామాన్ని ఉచ్చరించడమే విభేదాలను, కలతలను ఆహ్వానించడం అవుతుంది. మత వివాదాలను పరిష్కరించడం పట్ల వారికి ఏమాత్రం శ్రద్ధాసక్తులు లేవు. వారు ప్రతి మతాన్నీ కూకటి వ్రేళ్ళతో పెరికి వేయడమే తమ బాధ్యతగా భావిస్తారు. అందువల్ల వారిలో చాలా మంది మత ఘర్షణల్ని రెచ్చగొడుతూ ఉంటారు. మత కలహాల్లో ముమ్ముందు ఉంటారు. ఆ విధంగా మతాన్ని అప్రతిష్టపాలు చేస్తూ మత శక్తుల్ని బలహీనపరుస్తూ ఉంటారు. ఈ వర్గం భారతదేశాన్ని దాని వేనవేల సంవత్సరాల ప్రాచీన మత సత్‌సంప్రదాయాల నుండి వేరు చేసి మత రాహిత్య మార్గాన నడిపించాలని కోరుకుంటుంది. కాని మతం వ్రేళ్ళు మానవ స్వభావం లోతుల్లో ఎవ్వరూ పెకిలించి వేయనంతగా నాటుకు పోయాయన్న వాస్తవం వారికి తెలియదు. ఈనాడు యావత్ ప్రపంచంలో మత పునరుజ్జీవనానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. వాటి ప్రభావంతో "అభ్యుదయ"వాదుల ఎర్ర స్వర్గం కూడ సురక్షితంగ లేదు. దానివల్ల కూడ వారు గుణపాఠం నేర్చుకునేందుకు సిద్ధంగాలేరు.

సమైక్యతా సమగ్రతల మార్గంలో మతంగాని, మతాల ఆధిక్యతగాని ప్రతి బంధకం కాదు. వాస్తవమైన ప్రతిబంధకం మత రాహిత్యం, నేడు మతం పేరున జరుగుతున్న లజ్జావిహీనమైన మత విరోధ ప్రయత్నాలు. మతం పేరున చెలరేగు తున్న ఘర్షణల వెనుక ఏ ధార్మిక భావమూ ఉండదు. కేవలం అతినీచమైన వ్యక్తిగత, వర్గపరమైన ప్రయోజనాలే ఉంటాయి. లేక కేవలం కొన్ని భౌతిక, రాజకీయ

ప్రయోజనాలు ఉంటాయి. చూడ్డానికి ఘర్షణలు ఓ చిన్న సంఘటనతో ప్రారంభమవుతాయి. దాన్ని ప్రజలు తమ తమ మత బోధనల ద్వారా పరిష్కరించాలని కోరుకుంటే ఆ చిన్న సంఘటనలు పెద్ద కలహాలుగా మారజాలవు. ఈ నిప్పురవ్వల్ని బడబాగ్నిగా మార్చి మానవ బస్తీలను, విలువైన ప్రాణాలను భస్మీపటలం గావించేది ఆ మత రాహిత్యం, మత విరోధంతో చేసే ప్రణాళికాబద్ధమైన ప్రయత్నాలు. ఇదంతా మతం ముసుగులో జరుగుతుంది. దాని ఏకైక లక్ష్యం ధన, రాజకీయ ప్రయోజనాలు మాత్రమే. ఈ ప్రయత్నాలు ఏ మతానికీ గౌరవం, ప్రతిష్టను తెచ్చిపెట్టవు, పైగా అవమానం, అగౌరవ కారణమవుతాయి.

## మతానుయాయుల మధ్య అనైక్యతకు కారణాలు

మతాన్ని నమ్మే వారి మధ్య అనైక్యతకు, ఘర్షణలకు కొన్ని ఇతర కారణాలూ ఉన్నాయి. ప్రథమ మౌలిక కారణం, భారతదేశం కేవలం ఒక్క మతాన్ని నమ్మే వారిది మాత్రమే కాదని, వేలాది సంవత్సరాలుగా ఇక్కడ నివసిస్తూ వస్తున్న అన్ని మతాల వారికి చెందిందని అంగీకరించడానికి మనలో కొందరు వ్యక్తులు, కొన్ని వర్గాలు సిద్ధంగ లేరు. వీరు ఈ దేశాన్ని తమ సొంత ఆస్తిగా భావిస్తారు. ఇతరులను విదేశీయులని అంటారు. భారతీయులుగా పిలువబడ్డానికి కొన్ని షరతుల్ని వారు నిర్దేశించారు. వాటి సారాంశం, ఇతరులు వారి మత సంప్రదాయాలను తమ సంప్రదాయాలుగా వారి మత పురుషులను తమ మత పురుషులుగా అంగీకరించనంత వరకు వారు భారతీయులు కారు. మరో విధంగా చెప్పాలంటే వారి మతంలోని ఒక్కొక్క అంశాన్ని విశ్వసించనంత వరకు భారతీయులుగా పిలువబడ్డానికి వారు అర్హులు కారు. వారి అభిప్రాయంలో భారతీయులుగా భావించబడ్డానికి ఈ దేశం పట్ల ప్రేమాభిమానాలు, విశ్వసనీయతలు కలిగి ఉండడం సరిపోదు. ఇలాంటి బుద్ధి, ఆలోచనా విధానం ఉండగా ఈ దేశంలో శాంతి భద్రతలు ఏనాటికీ నెలకొనజాలవు.

రెండవ కారణం, తమ మతాన్ని సత్యమైనదిగా భావించడమంటే, తమ మతాచారాలను, మర్యాదల్ని గౌరవించడమంటే, తమ మత సంప్రదాయాలను,

మత పురుషుల్ని ఆదరించడమంటే దాని భావం, తమ మతాన్ని ఇతరుల నెత్తిన రుద్దడం, తమ పద్ధతుల్ని ఇతరుల చేత బలవంతంగా ఒప్పించడం. అది సాధ్యం కాకపోతే ఇతరుల విశ్వాసాలను పరిహసించడం, వారి ఆరాధనాలయాల్ని అగౌర పరచడం, వారి మత పురుషుల్ని అవమానించడం తప్పనిసరి అని భావించారు. ఇది పెద్ద పొరపాటు. ఈ రెండు విషయాలలో ఎలాంటి సంబంధం లేదు. నేను ఓ మత విశ్వాసం సరయినదని, ఇతర విశ్వాసం తప్పు అని భావిస్తే ఇతర విశ్వాసాన్ని పరిహసించే హక్కు నాకు ఎక్కడిదీ? నేను నా విధానాలే ఉత్తమమైనవని, ఇతర విధానాలను లోపభూయిష్టమైనవని భావిస్తే నా విధానాలను ఇతరులపై బల వంతంగా రుద్దే హక్కు నాకు ఎలా ప్రాప్తిస్తుంది? ఏ వ్యక్తి, ఏ వర్గం ఇలా చేసినా వారు మానవత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని మాత్రమే కాదు, తమ మత విలువల గొంతును సయితం నులిపివేసినట్లే.

మూడవ కారణం, మనలో చాలా మంది తమకు కావాలని కోరుకునే హక్కుల్ని ఇతరులకు ఇవ్వడానికి సిద్ధం కారు. ఉదాహరణకు మన ధన ప్రాణాలు భద్రంగా ఉండాలని కోరుకుంటాము. మన గౌరవ ప్రతిష్టల మీద ఈగ కూడ వాలకూడదు అని అనుకుంటాము. మనకు విద్యా, ప్రగతులు సాధించే అవకాశాలు పూర్తిగా లభించాలన్నది మన అభిలాష. పదవులు, ఉద్యోగాలు కూడా మనకు లభించాలని ఆకాంక్షిస్తాము. మన మత ప్రచారానికి కూడా మనకు సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలి. మన పిల్లలకు మన మత శిక్షణ గరిపే అవకాశం ఉండాలి. మన ధార్మిక సాంస్కృతిక సంస్థల్ని నెలకొల్పుకోడానికి, మన భాషను నేర్చుకోడానికి, బోధించడానికి, వృద్ధిపరచడానికి అన్ని సౌకర్యాలు కావాలి. అయితే ఈ హక్కుల్ని ఇతర మతాల వారికి ఇవ్వడానికి మనం సిద్ధంకాము. స్వయంగా మనం మన హక్కులను మించి పొందడానికి ఇష్టపడతాము. కాని ఇతరులకు వారి న్యాయ సమ్మతమైన హక్కుల్ని కూడ ఇవ్వడానికి ఇష్టపడము. మన ఈ వైఖరి న్యాయానికి విరుద్ధమే కాకుండ స్వయంగ మన ధర్మం బోధించే ఉత్తమ సంప్రదాయాలు, ఉన్నత `విలువలకు కూడ విరుద్ధమని మనం అసలు ఆలోచించము. ఈ వైఖరి

వల్ల మన మత ఔన్నత్యం ఇనుమడించడం అటుంచి యావత్ ప్రపంచంలో అవమానమే ప్రాప్తిస్తుంది.

మతాలను నమ్మిన వారి మధ్య అనైక్యతకు, వైషమ్యానికి ఈ మూడే పెద్ద కారణాలని నా అభిప్రాయం. నా దృష్టిలో వీటి పరిష్కారం ఏమంటే-

1. యుగాల తరబడి తరతరాలుగా ఇక్కడ నివసిస్తున్న హిందువులు, ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు, పార్సీలు తదితర వర్గాల వారందరికి చెందినది ఈ భారతదేశం అని భావించాలి. మన దేశంలో ప్రతి మతం, ప్రతి వర్గం వారికి సమాన హక్కులున్నాయని మనం చిత్తశుద్ధితో అంగీకరించాలి.
2. తమ మతం, ఆచార వ్యవహారాలు, తమ సంప్రదాయాలు, తమ విలువలను బలవంతంగా ఇతరుల నెత్తిమీద రుద్దరాదు. ఇతరుల ఆరాధనాలయాలు, మత పురుషులు, గ్రంథాలు, సంప్రదాయాలు, ఉత్సవాలు, వేడుకల్ని గౌరవించాలి.

   ఇతరుల మతం, మత సంప్రదాయాలు, మత పురుషుల్ని గౌరవించడం అంటే మనకు మన మత విషయాల పట్ల సంశయం, అనుమానం ఉన్నట్లు అర్థం ఎన్నటికీ కాదు. ప్రతి మతాన్ని సమానంగా భావించాలని, ఒక మతానికి మరో మతం మీద ప్రాధాన్యత ఇవ్వరాదని కూడ అర్థం కాదు. ఓ విషయం ఉచితమైనదని మరొకటి అనుచితమైనదని భావించరాదని కూడ భావం కాదు. ప్రతి మనిషికి, తనమాటను సరైనదిగా, ఇతరుల మాటను తప్పుగా భావించే హక్కు ఉంది. అలా అని ఇతరుల అభిప్రాయాల్ని, విషయాలను అగౌరవించే, అవమానపరిచే హక్కు కూడా ఎవ్వరికీ లేదు.
3. ఒకరు ఓ మతాన్ని విశ్వసించడానికి, లేక ఒకదాన్ని విసర్జించి మరో మతాన్ని ఆశ్రయించడానికీ హక్కు, స్వేచ్ఛ ప్రతి మానవునికీ ఉందని మనం అంగీకరించాలి. అతను తన అభిప్రాయాల్ని, సిద్ధాంతాల్ని, సాధారణ నైతిక నియమాలకు కట్టుబడి, ప్రజాస్వామిక హద్దుల్లో ఉంటూ ప్రచారం చేసుకోడానికి, దీనికి

ప్రసార ప్రచారాల అన్ని సాధనాలను అంటే ప్రెస్, పత్రికల్ని ఉపయోగించ డానికి, గ్రంథాలు ప్రచురించడానికి, పాఠశాలలు నెలకొల్పుకోడానికి సమాన హక్కులు కలిగి ఉన్నాడు.

4. చివరి మాట. మనం మన ధర్మంలోని సాధారణ మానవతా విలువల్ని విస్మరించరాదు. వాటిని మన మతం మౌలికమైన ముఖ్యమైన భాగమని భావించాలి. కులమత భేదాలు చూపకుండ ఆ విలువల్ని ప్రతి మానవుని పట్ల పాటించడం నేర్చుకోవాలి. ప్రతి మానవుని సేవ చేయడం, ప్రేమానురాగాలు కలిగి ఉండడం మన బాధ్యతగా భావించాలి. ఏ మానవుని పట్లనయినా అన్యాయం, అత్యాచారాలు మహాపాపమని గ్రహించాలి. ఓ మానవుణ్ణి అన్యాయంగ బాధించి, అతని న్యాయమైన హక్కును హరించి, అతని ధన, మాన, ప్రాణ, వస్తు సామగ్రిని నష్టపరిచి మనం మనకుగాని, మన మతానికి, మన దేశానికి గాని సేవ చేయడం లేదు. సత్యానికి, న్యాయానికి విరుద్ధంగ మనం వేసే ప్రతి అడుగు మానవత, నైతికత, ఆధ్యాత్మికత పట్ల అన్ని రకాలుగా అపచారమే అవుతుంది. మన ముక్తి మార్గంలో మేరువంతటి ప్రతిబంధకమే అవుతుంది.

ప్రతి మతంవారు తమ మతంలోని నిజమైన బోధనల్ని చిత్తశుద్ధితో పాటించి తాము ఆచరిస్తూ తమ తోటి సోదరుల్ని ఆచరింపచేస్తే మనం ఒక ఉత్తమ, ప్రశాంత, పటిష్ట సభ్య సమాజాన్ని నిర్మించడంలో విజయం సాధించగలమని నా నమ్మకం. ఈ విషయాలు తప్ప మరే ఇతర విషయమూ అవసరం కాబోదు.

## ఇస్లాం - జాతీయ సమైక్యత

జాతీయ సమైక్యత, సమగ్రత, సామరస్యాలకు సంబంధించిన అన్ని విషయాల్ని ఇస్లాం పూర్తిగ సమర్థిస్తుంది. ఇస్లాం దృష్టికోణంలో అన్ని మతాలు సమానంగ గౌరవించతగినవి. ఇతర మతాల వారి ఆరాధనాలయాలు, మహా పురుషులు, గ్రంథాలు, ఆచార వ్యవహారాలను గౌరవించడం ప్రతి ముస్లిం బాధ్యత. ఓ ఆరాధనాలయాన్ని నష్టపరచడం, ఓ మత పురుషుణ్ణి అవమానించడం, ఓ

మత గ్రంథాన్ని అగౌరవపరచడం ఇస్లాం దృష్టిలో మహాపాపం. ఆ పని ఓ ముస్లిం ఈనాడు చేసినా, లేక చరిత్రలో ఎప్పుడైనా చేసినా అది అపరాధమే. అది ఏ అభిప్రాయంతో చేసినప్పటికీ అలా చేసినవాడు తప్పు చేశాడు. ఇస్లాం సూత్రాలకు విరుద్ధమైన ఏ చేష్టనూ ఇస్లాం పేరుతో చేయడం ఇస్లాం సేవ కాజాలదు. పైగా అది ఇస్లాంకు పరాభవ కారణం అవుతుంది. ఈ విషయంలో దివ్యఖుర్‌ఆన్ స్పష్టంగా ఆదేశాలిచ్చింది. ప్రవక్త (స) ఆచరణలో స్పష్టమైన ఆజ్ఞలున్నాయి. ఇస్లామీయ శాసనాల్లో దాని గురించి స్పష్టమైన చట్టాలున్నాయి. ఓ ముస్లిం రాజు చర్య వల్ల, ఓ ఖాజీ (న్యాయమూర్తి) తీర్పు వల్ల, ఓ అధికారి ఆజ్ఞ వల్ల, ఓ ముఫ్తీ ఫత్వా వల్ల ఆ సూత్రాల్లో ఎలాంటి మార్పు జరిగేందుకు అవకాశం లేదు.

ఇస్లాం ప్రతి మానవునికి స్వయం నిర్ణయాధికారం, ఎంపిక చేసే స్వేచ్ఛ ఇస్తుంది. ప్రతి మత వర్గానికి తన మతాన్ని ఆచరించడానికి, దాన్ని ప్రచారం చేయడానికి, దాని కోసం పాఠశాలలు నెలకొల్పుకోడానికి, ప్రెస్, పత్రికల్ని ప్రయోగించడానికి, గ్రంథాలు ప్రచురించుకోడానికి హక్కు ఉంది. మతం మార్చుకోడానికి బలవంతం చేయడాన్ని ఇస్లామ్ సమ్మతించదు. ***"లా ఇక్‌రాహ ఫిద్దీన్" "ధర్మం విషయంలో ఎలాంటి బలవంతం లేదు"*** అని దివ్యఖుర్‌ఆన్ ఆజ్ఞాపిస్తుంది. మతాచారాలలో, ఉత్సవాలు, వేడుకలలో, సంస్థలు, పర్సనల్ లాలో జోక్యం చేసు కోడాన్ని ఇస్లామ్ సరయినదిగా భావించదు. ముస్లిం పాలకులు ఇస్లాం బోధనల ప్రకారం తమ పాలిత జాతులకు వాటి మత విషయాల్లో పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. వారి పర్సనల్ లాకు భద్రత కల్పించారు. దాన్ని అమలు జరపడానికి ఆ మతం అనుయాయులనే నియమించారు. వారి కేసుల్ని పరిష్కరించడానికి వారి న్యాయమూర్తుల్నే నియమించారు. ఈ వైఖరే ఇస్లాం బోధనలు, దాని నిజమైన సంప్రదాయాలకు అనుగుణంగా ఉంది. దానికి విరుద్ధంగ ఏదైన, ఎక్కడైన జరిగితే అది ఇస్లామేతర విధానం, దోషభూయిష్టమైన విధానం. ఇస్లాం ప్రతి మానవుణ్ణి ఒకే తల్లిదండ్రుల సంతానమని భావిస్తుంది. సర్వమానవులు పరస్పరం సోదరులని, అందరూ సమానులని భావిస్తుంది. ఈ విషయం కేవలం ముస్లింల వరకే పరిమితం

కాదు. ప్రతి మతం, ప్రతి సమాజం, ప్రతి దేశం, ప్రతి వర్గంలోని మానవులు ఇతర మానవులకు సోదరులు, వారికి సమానులు. మానవులుగా అందరి ధనం, మానం, ప్రాణం, మతం, పంథా సమానంగ గౌరవించతగినది. అన్నింటినీ సంరక్షించడం, అన్నింటినీ గౌరవించడం ప్రతి ముస్లిం బాధ్యత. ఇస్లాం ప్రతి అన్యాయాన్ని అన్యాయమనే అంటుంది. అది ఎవరు చేసినా, ఎవరికి విరుద్ధంగా చేసినా, ఏ ఉద్దేశ్యంతో చేసినా అది అన్యాయమే. ఇస్లాం యావత్ మానవాళిని **"అయాలుల్లాహ్" దేవుని కుటుంబం**- అంటుంది. ప్రతి మానవుని సేవను దైవా రాధనగా పరిగణిస్తుంది. అతను ముస్లిం అయినా ముస్లిమేతరుడు అయినా సరే. తన పొరుగువారు, తన వీధి వారు, తన పట్టణం వారు, తన దేశవాసుల హక్కును ఇతరుల కంటే అధికతరమని స్పష్టం చేస్తుంది- ఆ ఇతరులు ముస్లింలయినా సరే. త్యాగం, ఉపకారం, సత్ప్రవర్తన ఏ మానవుని పట్ల ప్రదర్శించినా అది ఇస్లాం దృష్టిలో అనేక ఆరాధనలకు మించినది; అది దైవ సామీప్యానికి, దైవ ప్రేమకు గొప్ప సాధనం.

మహాశయులారా, ఈ విషయాల సమర్థనకు దివ్యఖుర్ఆన్, ప్రవక్త (స) హదీసులను కొన్నింటిని ఉల్లేఖించడం సమంజసమని భావిస్తున్నాను.

- "ప్రజలారా! పరస్పరం అనుమానించుకోకండి. పరస్పర వ్యవహారాలు రహస్యంగా తెలుసుకునేందుకు ప్రయత్నించకండి. ఒకరికి విరుద్ధంగ మరొకర్ని పురికొల్పకండి. పరస్పరం ఈర్ష్య, వైషమ్యాలకు దూరంగా మెలగండి. పరస్పరం పోటీ పడకండి. దేవుని దాసులుగా, పరస్పరం సోదరులుగా మెలగండి". *(హదీసు)*
- "ఎవరి దౌర్జన్యం, అత్యాచారాల నుండి అతని పొరుగువానికి భద్రత లేదో అతను విశ్వాసి (మోమిన్) కాడు." *(హదీసు)*
- "ఒకడు దౌర్జన్యం చేస్తున్నాడని యెరిగీ అతనికి తోడ్పాటు నివ్వకండి." *(హదీసు)*

- "మీ మిత్రత్వం అయినా శత్రుత్వం అయినా కేవలం దైవం కొరకే కావాలి." *(హదీసు)*
- "అసత్య విషయంలో తన జాతిని సమర్థించడం అంటే తన ఒంటె బావిలో పడుతూ ఉండగా తాను కూడ దాని తోక పట్టుకుని బావిలో పడడంతో సమానం." *(హదీసు)*
- ఒక జాతి శత్రుత్వం కారణంగ దాని పట్ల మీరు అన్యాయం చేయడానికి సిద్ధపడరాదు. న్యాయం చేయండి. అదే ధర్మనిష్టకు, దైవ భీతికి సమీప మార్గం. *(ఖుర్ఆన్)*
- ధర్మం విషయంలో ఏ విధమైన బలవంతం సమ్మతం కాదు. *(ఖుర్ఆన్)*
- అల్లాహ్‌ను కాదని పూజించే ఆరాధ్యుల్ని ఎంతమాత్రం చెడుగా పిలువకండి. *(ఖుర్ఆన్)*
- తమకు ఇష్టమైన దాన్నే ఇతరుల కొరకు కూడ కోరుకోండి. *(హదీసు)*
- నేను మిమ్మల్ని దేవుని అవిధేయత నుండి తప్పించుకోవాలని, సత్యమే పలకాలని, వాగ్దానాన్ని నెరవేర్చాలని, పొరుగు వారి హక్కుల్ని కాపాడాలని, కోపాన్ని అణచివేయాలని, ప్రజలతో మృదువుగా మాట్లాడాలని, వారి శ్రేయోశాంతి కొరకు దుఆ చేయాలని ఆదేశిస్తున్నాను. *(హదీసు)*
- మీది ఉత్తమ సముదాయం. దీన్ని మేము ప్రపంచ ప్రజల కొరకు ప్రభవింప జేశాము. మంచిని ఆజ్ఞాపించడం, చెడును నిర్మూలించడం మీ బాధ్యత. *(ఖుర్ఆన్)*
- సత్కార్యాలు, నిష్ఠాపరత్వపు పనుల్లో పరస్పరం సహకరించుకోండి. దుష్కార్యాల్లో, అత్యాచారాల్లో సహకరించుకోకండి. *(ఖుర్ఆన్)*

